శుభమస్తు.

శ్రీరామచంద్రాయ మంగళం.

# శ్రీమద్భాగవతసారము




ఇది.

శ్రీమద్భాగవత ద్వాదశస్కంధములనుండి శ్రీసత్యసంధతీర్థ గురువరుల సంగ్రహీత మగు 32 శ్లోకములున్ను శ్రీశ్రీవత్సాంక కృష్ణమూర్తి ఆచార్యులవారిచే వ్రాయఁబడిన చాతుశ్శ్రీ భాగవత శ్లోకములు 24 న్ను ద్వితీయ స్కంధాంతర్గత చతుశ్శ్లోకిభాగవతమున్ను కలిగి

---

గోదావరిజిల్లా రామచంద్రపుర వాస్తవ్యుఁడగు ఎం. మూర్తి శ్రీనివాసరావుచే ఆంధ్రీకరింపఁబడి ప్రకటింపఁబడియె.



మొదటికూర్పు 500 ప్రతులు.

---

Printed by the Proprietor K. V. Kristna Rao

at the Vidya vinodini Press

Ramachandrapuram.

1922



వెల రు 0-4-0

చూపిన ప్రతిపదార్థముతో చదువుకొనుచుండిన ప్రతిని జూచి దానిని నేను వ్రాసుకొని యుంటిని.

4. ఈబళ్లారిగ్రామమునకు నేనుద్యోగవశాత్తు వచ్చి యుండ నిచ్చట మయిసూరు సంస్థానాధీశపండితులును బ్రహ్మణ్య విష్ణుపాదాచార్యాత్మజులును అగు కృష్ణమూర్తి ఆచార్యులవారి సందర్శనలాభమబ్బెను ఆమహనీయులు గాయత్రీరామాయణసాంకేతికమునసే గాయత్రీభాగవతశ్లోకములనెత్తి తిమనిచదివిరి వానిని నేను వ్రాసుకొనియుంటిని వారే భాగవతమూలమంత్రమును ముందుచదివి భాగవత పారాయణ మారంభించవలెనని నుడివిరి వానినిగూడ వ్రాసుకొంటిని గాయత్రీభాగవత శ్లోకములు సేకరించినతోడనే బ్ర॥శ్రీ వావిలికొలను సుబ్బారాయుని రామాయణపీఠికలోనున్న గాయత్రీరామాయణ శ్లోకార్థపద్యములబోలి వీనికినిగూడ పద్యములున్న బాగుండునని స్ఫురించి మామిత్రులగు శ్రీనివాసరాయని కా యుద్దేశము దెలిపితిని శ్రీఆచార్యుల వారి యాజ్ఞానుసారము మొలుదొల్త భాగవత మూలమంత్రము తరువాత చతుశ్శ్లోకీభాగవతము అటుపిమ్మట శ్రీ సత్యసంధ తీర్థులచే సంగ్రహింపబడిన 32 శ్లోకములు తెలుగు ప్రతిపదార్థముతో గూడ వ్రాయింపబడియె మామిత్రులు శ్రీనివాసరావుగారు రామాయణ కపిలని పంచ్చ్వరము క్రిందనే వ్రాసిరిగాని కారణాంతరముల చేత అచ్చొత్తించుభాగ్యము నేటివరకబ్బలేదు ఈశ్వరానుగ్రహమువలన భాగవతసారము అనుపేర నీభాగము ముద్రింపబడి ప్రచురించ గలుగుటకు సంతసించుచున్నాము.

5. వీనివెనువెంటనే మామిత్రులు రామచంద్ర ప్రభో స్తోత్రమును జననీస్తవమును రచియించిరి అవిగూడ కొలది కాలములో ప్రచురింపబడును హస్తప్రతులు చూచినవారందరు త్వరలో ప్రచురింపబడవలెనని కుతూహలపడుచున్నారు.

6. ఈచిన్నపుస్తకములు ప్రకటించుట పాండిత్యప్రకర్షమునకు గాదు. భక్తిపురస్సరమగు సేవయే ప్రాధాన్యము కాని వేరొండుకాదు. భాగవతమహాగ్రంథపఠనావిశేషమాహాత్మ్యము సంగ్రహీతల యందలి భక్తివిశ్వాసము పరస్పర శ్రేయోభిలాషయే కారణము అశ్లేషాంశములు గ్రహించి మన్నింతురు గాక పైనవివరించిన మహనీయులందరకిని కృతజ్ఞతాపూర్వక వందనములు.

బళ్ళారి 17-8-22. ఇట్లు విన్నవించువిధేయుడు

పొద్దుటూరి నరసింగరావు బి.యె. డిస్ట్రిక్టురిజిస్ట్రారు

బళ్ళారిజిల్లా హరపనహళ్ళి హైస్కూలు పండితులగు
బ్రహ్మశ్రీ॥ పాలపూడి నరసింహశాస్త్రిగారు
దయతో నొసంగినయభిప్రాయము

శ్లో॥ శ్రీమద్భాగవతాఖ్యః । కల్పతరుశ్శ్రూయతేహివసుధాయాం
యత్సంస్మృతిసంతాపేనితాంతముపశాంతిసంతతిందిశతి॥

శ్లో॥ తత్పుణ్యంప్రాగ్భవజంతత్సేవాహి కవిత్వగాంభీర్యాత్
భాగవతసారరచనాకౌశల్యం యన్మృదూక్తిశతైః॥

ఉ॥ ఆడఁగవచ్చుమాటలనగ్గలదాబెదమంచు శాస్త్రముల్
సూడఁగవచ్చు వేసటయునుంతయు లేకను పాటపద్దెముల్
పాడఁగవచ్చు గానిమఱి భాగవతంపుచవిందరింపనే
వాఁడునమరుఁడౌ భువిని. నిదెపుణ్యమగణ్యగుణ్యముల్॥

గీ॥ రామునత్కృపచే గ్రంధరచనగడఁగు
పుణ్యభాగికిఁ నేనులంబొలముభయమె ।
అమృతసత్స్వనరండం బుఁదుకొనిన
మనుజునకుఁ బెల్లు దాహంపుమాటయేల ॥

శ్రీభాగవత మహాజనులారా!

శ్రీమద్భాగవతంబన శ్రీశుకముఖచ్యుతమగు నిగమకల్పతరు సత్ఫలం
బు. తదాస్వాదంబు అమృతపానంబునకసంఖ్యేయగుణంబు
లధికంబనుట అతిశయోక్తి కాదు. అట్టి శ్రీమద్భాగవతంబున ఖిలం
బు నాకలించుట కలిదూషిత మానసులకు సుకరంబు కాదు. ఇంత
యేల? "భగవద్భక్తి శూన్యులకిందుఁబ్రవేశమే లేదు" అని యీగ్రం
థమే చెప్పుచున్నది. కావున నీగ్రంథసారము సంగ్రహించిన మహా
త్ముల శిష్యదయాళుత్వము వర్ణనీయము. ఇట్టి సద్గ్రంథ తాత్పర్యమి
తర భాషలలోఁ బ్రకటితమై యున్నను "స్వస్థాన వేష భాషాభి మతా
స్సంతో రసప్రిలుబ్ధయః,, అని నన్నయాచార్యులు సెలవిచ్చినట్టు
లస్మద్దేశీయు లెల్లరు (ఎవరో కొందరు కాక) దేశభాషలందుఁ దెలుగుతె

న్నఅని మన్ననగన్నయాంధ్రంబునఁజదువుకొనిన యానంద లాభంబు నుంబోలదు. ఇట్లు మృదుమధుర శైలి నొప్పు నాంధ్రంబునను వచించి నట్టియు, బోధ్రత్న హించ ప్పట్టియు శ్రీనివాస శ్రీనరసింహుల శ్రీనివా నుండును శ్రీనరసింహుఁడనగు నాశ్రీకాంతుఁడు భక్తిజ్ఞాన వైరాగ్యము లను నఖిలసుఖంబులనిచ్చి కాపాడుఁగాక ఇంకనీభాగవత సారంబు నాంధ్రాను వాదంబు చక్కని శైలి నొప్పుచున్నది.

ఈ నామిత్రులగు శ్రీనివాసరావు పంతులు కుణదావళి, మొదలగు గ్రంథములను ప్రకటించి యున్నారు. ఇంకను మఱి కొన్ని యప్రకటిత గ్రంథములు కలవు వానినిఁగూడ వెంటనే ప్రకటింప వీలుకలిగినచో మధ్వలోకమునకెల్ల మధ్వలోకమన నేల ఆంధ్రలోకమునకే గొప్పలాభము కలుగునని తలచెద.

| | | |
|---|---|---|
| 28—8—22. | } | ఇట్లు సద్విధేయుఁడు. |
| రామచంద్రపురం. | } | శ్రీపాద పాపయ్యశాస్త్రి. |

(ఇష్టదేవతా ప్రార్థనాదికము.)

శా॥ శ్రీరామాకృతిఁబూని దేవహనుమత్సేవా ప్రియంబందియా
ధీరగ్రామణి పెద్దాపురపటుల్ భీమాప్తితాంఘ్రిద్వయీ ।
నీరేజుండయి వ్యాసరూపధరుఁడై నేఁడా బదర్యాశ్రమా ।
గారుండౌనసి మధ్వసేవితు శ్రీకాంతుస్మరింగొల్చెదన్ ।

గీ॥ సతతమాదుతిస్మృతి పురశ్చరణపూతు ।
ననవృశదవాకరోపాస్తి సలఘుయశుని ।
గరను ప్రోపశకర్మాధి కారియైన ।
మత్పితరు నృసింహాచార్యు మదినిగొలుతు ।

గీ॥ అనవరత తపశ్శాలు లైనట్టివేము ।
గంటివారింట జన్మించి పాంటు లేని ।
యధ్యయన పరులైల సాచ్చి యద్ధగన్న ।
రామబాయంబను పదంబబ్రస్తుతింతు ।

ఎ॥ శ్రీ॥



శ్రీమద్వ్యాస మహాముని మధ్యాంతర్గత,

శ్రీరామచంద్రో విజయతాం

# శ్రీమద్భాగవతసారము.

## భాగవతమూలమంత్రము.

శ్లో॥ నమస్తే భగవన్వ్యాస సర్వశాస్త్ర విశారద ।
ఏతత్కథా ప్రసంగేన మదజ్ఞానం వినాశయ॥

శ్లో॥ నమస్తే భగవన్ వ్యాస సర్వశాస్త్రవిశారద । బ్రహ్మవిష్ణుమహే
శానాం మూర్తయే తే నమోస్తుతే॥

గీ॥ వ్యాస సత్యవతీసుత బ్రహ్మ విష్ణు
శంకరాత్మైక మూర్తి! నా సర్వశాస్త్ర
చయవిశారద! నాపై ప్రసన్నుడగుచుఁ
బాపుమజ్ఞానమును నీకగు నమోస్తు ॥

శ్లో॥ శ్రీమద్భాగవతాఖ్యోయం ప్రత్యక్షఃకృష్ణ ఏవ హి
స్వీకృతాసి మహాపాప్రి! ముక్త్యర్థం భవసాగరే

గీ॥ భాగవతమను నో మహాప్రాజ్ఞకృష్ణ
నీవు ప్రత్యక్షతనువుగా గాదె పుడమిఁ
గలిగి వెలసెను భవమను జలధిలోన
మునిగియున్నట్టి జనముల ముక్తికొరకు॥

శ్లో॥ సంసారసాగరే మగ్నం దీనం మాం కరుణానిధే ।
కర్మమోహగృహీతాంగం మాముద్ధర భవార్ణవాత్

గీ॥ కర్మమోహాంధకార మయమగు కాయముఁగొని
పారమేలేని సంసార వారిరాశి
దిరుగుదీనుఁడ నాగాధఁ దెలిపివేగ
నుద్ధరింపవె కరుణాపయోధిఁ నన్ను।

ఇతి శ్రీభాగవత మూలమంత్రం సమాప్తం

## చతుశ్లోకీఅథవాసప్తశ్లోకీభాగవతం.

(ద్వితీయస్కంధన నవమాధ్యాయస్థం)

శ్లో॥ జ్ఞానంపరమగుహ్యంమేయద్విజ్ఞానసమన్వితం । సరహస్యంతదంగంచగృహాణ గదితంమయా॥ స్కం ౨అ౯ శ్లో ౩౧

గీ॥ నియతముక్తినొసగు నిజబింబవిషయక
జ్ఞానయుతము నుపనిషత్త్రిసంగ
యుతముగాఁగసాం మొసఁగెదజ్ఞానమ్ముఁ
గొనుమిఁకనాపరమగోప్యమిద్ది॥

గీ॥ నియతముక్తికిఁ బ్రాపకంబయినయాత్మ
బింబ విషయః విజ్ఞానబీజయుతముఁ
గొనుముమజ్ఞానమునుబహుగోప్యమంగ
యుతమునుపనిషద్వాదసంమతమునిత్తు ॥

శ్లో॥ యావానహం యథాభావో యద్రూపగుణకర్మకః ।
తథైవతత్త్వవిజ్ఞానమస్తుతే మదనుగ్రహాత్ ॥ స్కం ౨ ౯ శ్లో ౩౨

క॥ నాతగుపరిమాణముమతి
నాదుస్వభావావతారనానాగుణక
ర్మాదులతత్వజ్ఞానము
నాదయలభియించు నీకునాళీక భవా,

శ్లో॥ అహమేవాసమేవాగ్రే నాన్యద్యత్సదసత్పరం ।
పశ్చాదహంత్వమేతచ్చయోవశిష్యేతసోస్మ్యహం॥ -౩-౯-33.

సీ॥ ఏనొక్కఁడనయు దుస్సృష్టికిఁ బూర్వము
కాలప్రికృత్యాదికంబులెల్ల
మద్భిన్నమయ్యును మదధీనములుగాన
లీనమైయుండునాలోనసవును
సృష్ట్యనంతరమేను నీవును జగతియు
నుండుము ప్రళయంబుకొఁదువెనుక
మిగిలియుండెదు నదితగనేనొకండనే
స్థితికాలమపుడు పరిసిద్ధివడయు

గీ॥ నేనుగర్తనుభోక్తను నేనయనెడు
జగతిసాత్విక త్వమెల్ల ననత్యమరయ
బుద్ధిమోహమూలముగాని మూఁడుకాల
ములను మదధీనము త్వదాదిభువనమెల్ల॥

శ్లో॥ ఋతేర్థం యత్ప్రతీయేత నప్రతీయేతచాత్మని ।
తద్విద్యాదాత్మనోమాయాంయథాభాసోయథాతమః ౨-౯-3౪

ఉ॥ ఎయ్యదిగల్గనాకు నొకయింతప్రయోజనమైన లేదోనా
కెయ్యదిబాధకంబు గలిగింప సమర్థముగాకయుండునో
అయ్యదెరుంగుమయ్య పరమాత్ముడనైన మదీయమాయఁగా
నొయ్యననిందజాలమననొల్లదు దానిమతెట్టులంటివా॥

గీ॥ తృణములాదిగఁ దననుండిసృష్టమైన
జగతినెల్లను కాలమానన్న గ్నైన
యవును యమవహ్నిరుద్రాత్ముఁడగుచు హరిమ
జలదములఁబోలెవాయువుసాగఁదోలు॥ ౪

శ్లో॥ వనేషుపుణ్యోపవనాద్రికుంజేష్వపంకతోయేషుసరిత్సరస్సు
అనంతలింగై స్సమలంకృతేషు చచారతీర్థాయతనేష్వనన్యః ౩-౧-౧౭

గీ॥ వరలునెచ్చోటశ్రీహరిప్రతిమలట్టి
వనమహీధ్రనికుంజోపవనములందు
విమలనదులందు సరసుల విమరుఁడొంటి
తీర్థభూములభక్తిమైఁదిరుగుచుండె ॥ ౫

శ్లో॥ రజసాకుంఠమనసః కామాత్మానోజితేంద్రియాః ।
పితౄన్యజంత్యనుదినంగృహేష్వభిరతాశయాః ॥ ౩-౩౩-౧౭

గీ॥ రేబవలు నింద్రియముల నిగ్రహించ లేక
దారపుత్రాది సుఖముల గోరుకొనుచు
విషయలుబ్ధాత్ములై సదాపితృగణములఁ
గొలుచుచుంద్రు రజోగుణకుంఠమతులు। ౬

శ్లో॥ నృత్యంతిస్మస్త్రియోదేవ్యఆసీత్పరమమంగళం
దేవాబ్రహ్మాదయస్సర్వేఉపతస్థురభిష్టవైః॥ ౪-౧-౫౫

గీ॥ నర్తనలుచేసిదేవకన్యాగణమ్ము
గానములుసేయపరమమంగళములొలసె
బ్రహ్మమొదలుఁగ దేవతల్పలసి వచ్చి
ఆదిమునులను స్తుతియించిరప్పుడిట్లు॥

శ్లో॥ యోనారదాదాత్మవిద్యామధిగమ్యపునర్మహీం
భుక్త్వావిభజ్య పుత్రేభ్యఐశ్వర్యంసమగాత్పదం॥ ౪-౩౧-౩౨

సీ॥ యమివరుఁడు నారదుఁడు తనకాత్మవిద్య
జెప్పఁగైకొని రాజ్యముం జిరమొనర్చి
సకలరాజ్యమ్ము సుతులకుఁ జక్కఁ బంచి
యిచ్చియుత్తమపదవికి నేగెనంత॥		౯

శ్లో॥ భగవానపి భారత తదుపనీతార్హణః
సూక్తవాక్యేన నితరాముదితగుణగణావతార
సువిజయః ప్రియవ్రతమాదిపురుషః తం సదయ
హాసావలోక ఇతి హోవాచ॥		౫-౧-౧౦

గీ॥ భరతవంశోత్తముఁడు ప్రియవ్రతుఁడొసంగు
స్వాగతస్తుతివాక్యపూజనములంది
విశ్వవిదితోరుగుణగణవిజయుఁడైన
దాతయిట్లనెనవ్వుచు దయదలిర్ప॥

శ్లో॥ [గాయతిచేదం] కర్తాస్య సర్గాదిషు యోన బధ్యతే
నహన్యతే దేహగతోపి దైహికైః
ద్రష్టుర్నదృగ్యస్యగుణైర్విదూష్యతే
తస్మైనమోసక్తవివిక్తసాక్షిణే		౫--౧౯--౧౨

సీ॥ గోరుపాశైనబంధయుక్తుఁడవుగావు
కర్తవై సృష్టికిని దేహగతుడవయ్యుఁ
దనువుదోషంబులంటవు కనులదృష్టి
వగుచు దృక్పాపమును బొందవగుటసాక్షి॥		౧౦

శ్లో॥ దేహ్యజ్ఞోజిత షడ్వర్గో నిచ్ఛన్కర్మాణికార్యతే
కోశకారఇవాత్మానం కర్మణాచ్ఛాద్య ముహ్యతి॥		౬-౧-౫౨

సీ॥ దేహితెలియక యిందియాధీనుఁడగుచుఁ
దవిలికర్మలఁజేయుఁ బాపివశుఁడగుట

గూఁడు నిర్మించి లోనుండి గూటికోదవు
వృద్ధిహానులఁ దెలియని కృమియుఁబోలె॥ ౧౧

శ్లో॥ వరదోసియదిబ్రహ్మన్ పుత్రమింద్రహణంవృణే
అమృత్యుంమృతపుత్రాహంయేనమేఘాతితౌసుతౌ॥ ౬-౧౮-౩౫

గీ॥ వరదుఁడైతేని వరమిమ్ము సుతుఁగన
నాదుసుతులఁజంపు నయవిదూరు
నింద్రుఁజంపఁగలుగు నిద్ధబలాఢ్యుని
జావులేనివాని సరగనాకు॥ ౧౨

శ్లో॥ సమఃప్రియస్సుహృద్బ్రహ్మన్ భూతానాంభగవాన్స్వయం
ఇంద్రస్యార్థేకథందైత్యానవధీద్విషమోయథా॥ ౭-౧-౧

గీ॥ సర్వభూతములకు సముఁడు నెచ్చెలియును
బ్రియుఁడనంతుఁ డాదివిష్ణుదేవుఁ
డమరనాథుకొఱకు నసురులనేటికి
వెదకిచంపువాఁడు విషముఁడట్లు॥ ౧౩

శ్లో॥ ధర్మశ్చగృహమేధీయోవర్ణితఃపాపనాశనః
గృహస్థోయేనపదవీమంజసాన్యాసినామియాత్॥ ౭-౧౬-౭౪

గీ॥ ధరఁ గృహమేధిఁ దెల్పి తగనాచ
రించ మోక్షపదవి కేగఁగలఁడొ
అఖిలఘోరపాపహ మగుధర్మముల్
విస్తరించఁబలికె మునివిశదముగను॥ ౧౪

శ్లో॥ మధుకైస్సాలతాలైశ్చ తమాలరసనార్జునైః
అరిష్టోదుంబరప్లక్షైః వటైఃకింశుకచందనైః॥ ౮-౨-౧౨

గీ॥ మధుకసాలతాల మందారహింతాల
పనసకింశుకేక్షుపాటలాత

గీ॥ యదువిధర్మశీలు ననవ్వయమునువింటి
విస్తరముగనందువిష్ణుడవత
రించి విక్రమముల నేమేమిసలిపెనో
చెవులపంటవుగనుజెప్పవయ్య ౧౯

శ్లో॥ నహ్యేతస్మిన్ కులేజాతా అధనా అబహుప్రజాః
అల్పాయుషోల్పవీర్యాశ్చ బ్రహ్మణ్యాశ్చ దరిద్రకేః॥ ౧-౧౦౩--౨౭

గీ నల్లనయ్యకులమున జననమునొందు
వారలెల్లబ్రహ్మణ్యుల వార్యవీర్య
వంతులును బహుప్రజలునసంతభాగ్య
యుతులు దీర్ఘాయువులుసుమీయోనరేంద్ర॥ ౨౦

శ్లో॥ ద్రష్టుంవిలజ్జతీయుష్మాన్ ప్రబుద్ధితా మోఘదర్శనాః
ప్రసోష్యతీపుత్రికామాకంస్విత్సంజనయిష్యతి। ౧౧-౧-౧౪

గీ॥ ప్రియు కెచెతుము జెప్పుడాపన్నసత్వ
యీనరాఱో హాపుత్రార్థ యేమికనునో
లజ్జచేమిమ్ముసమగంజాలదుశుభాంగి
జ్ఞానదృక్కులుమీరలోమానులార॥ ౨౧

శ్లో చతుర్భుజం తంపురుషం దృష్ట్వాసకృతకిల్బిషః
భీతఃరే పపాత శిరసా పాదయోరసురద్విషః॥ ౧౧-౩౦-౩౮

గీ॥ చారుమూర్తి చతుర్భుజు సకలదనుజ
భంజనునిగృష్ణుంజూచియాపాపియంతం
దారిసకంపితహృదయుండై తనదుశిరము
పాదములుసోక హరిమ్రోలంబడియెవాడు॥ ౨౨

శ్లో॥ దాంపత్యేభిరుచిర్హేతుః మాయైవవ్యవహారికే
స్త్రీత్వేపుంస్త్వేచాభిరతిః విప్రత్వే సూత్రమేవహి ౧-౨-౨-౩

గీ॥ దంపతులపాత్రులకునగుఁ దలఁప హీతు
వభిరుచియె మాయయే వ్యవహారమునకు
స్త్రీత్వపుంస్త్వములకు మనోజ్ఞత్వమగును
బ్రహ్మసూత్రమ్మె గురుతు విప్రత్వమునకు ॥ ౨౩

శ్లో॥ యశ్చసంశ్రావయేన్నిత్యమ్ యామంక్షణమనన్యధీః
శ్రద్ధావాన్ యశ్చ శృణుయాత్పునాత్యాత్మానమేవచ॥

గీ॥ యామమోలేక క్షణమొ ప్రత్యహముచిత్త
మన్యసక్తంబుఁగానీక సతులభక్తి
నెవఁడు దీనివినిపించు నెవఁడువినునొ
దనదుమదిఁబావనముచేసికొనునువాఁడు॥ ౨౮

శ్లో॥ ఇదంభాగవతం కృత్స్నం గాయత్రీబీజసంయుతం
త్రిసంధ్యం యఃపఠేన్నిత్యమ్ కృష్ణసాయుజ్యమాప్నుయాత్

క॥ ఈయది భాగవతము
గాయత్రీబీజవర్ణకలితము దీనిన్
బాయకఁద్రిసంధ్యఁబఠనము
సేయుఁడ సాయుజ్యముక్తి చేకురునుదుదిఁ॥

ఇతిశ్రీగాయత్రీభాగవతమ్ సమాప్తం



శ్రీలక్ష్మీహయగ్రీవాయనమః

అథశ్రీసత్యసంధతీర్థగురురాజసంగృహీత
శ్రీమద్భాగవతద్వాదశస్కంధాన్తర్గతద్వాత్రింశచ్ఛ్లోకాః

---

శ్లో॥ జన్మాద్యస్య యతోऽన్వయాదితరతశ్చార్థేష్వభిజ్ఞస్స్వరాట్
తేనే బ్రహ్మ హృదా య ఆదికవయే ముహ్యంతియత్సూరయః
తేజోవారిమృదాం యథా వినిమయో యత్ర త్రిసర్గో మృషా
ధామ్నా స్వేనసదానిరస్తకుహకంసత్యంపరంధీమహి॥ ౧.౧-౧

వ్యా॥యతః = ఎవనివలన,అస్య = ఈప్రపంచముయొక్క,జన్మాదిః = సృష్టిస్థితిసంహారాదులు,అన్వయాత్ = శ్రుతిస్మృతులఅన్వయమును బట్టియు ఇతరతః = తర్కమునుబట్టియు,కలుగుచున్నట్లునిశ్చయింపబడినవో.(ఎవడు) అర్థేషు = ఘటపటాదిసర్వపదార్థములవిషయమై,అభిజ్ఞః = సంపూర్ణజ్ఞానముకలవాఁడో,యః = ఎవఁడు,ఆదికవయే = చతుర్ముఖబ్రహ్మకు,బ్రహ్మ = సాంగవేదమును,హృదా = స్నేహముతో,తేనే = వినివాదానిరిగాఁజేసెనో,యం = ఎవనివి[ఎవనిఅనుగ్రహముకేక]; సూరయః = బ్రహ్మాదులునుగూడ,ముహ్యంతి = జ్ఞానహీనులున్నా అన్యథా జ్ఞానముకలవారు నగుదురో ,తేజోవారిమృదాం = అగ్ని,ఉదకము మృత్తు వీటియొక్క,వినిమయః = కార్యములు, యథా = (అగ్నకతయాయోగ్యములు) యట్లో,అట్లే,యత్ర = ఏశ్రీహరిఆధారముచేత చేయఁబడుచుండెడు త్రిసర్గః = జీవేశ్వరజడములయొక్కసృష్టి, అమృషా = అసత్యముకాదోఅవగాహ్యమైనదో,అట్టి, స్వేన = తనయొక్క, ధామ్నా = జ్ఞానమహిమచే,సదా = యెల్లప్పుడు, నిరస్త = పోఁగొట్టబడిన,కుహకం = మాయాదిగలట్టియు,పరం = కళ్యాణగుణపరిపూర్ణుడైన,శ్రీహరిని, ధీమహి = ధ్యానము చేయుచున్నాము

చ॥ జననము రక్ష నాశమును జ్ఞానము మోహము శిక్ష మోక్షబం
ధనములు గల్గుచుండ భువనంబున కెవ్వఁడు మూలకారణం
బనుచుఁదగన్ శ్రుతిస్మృతిసమన్వయతర్కము లేర్పరించు, నె
వ్వనికిఁ జగత్పదార్థచయ భావవిశేషసమగ్రహా...
ర్తనములు గోచరంబులగుఁ దాఁదనకెవ్వఁడు ... రాజౌనుం
గునొ, శ్రుతులన్ జతుర్ముఖునకున్ మనసారఁగఁజెప్పెనెవ్వఁడే
వ్వని పరిపూర్ణశక్తివిభవంబులఁదద్దయు నేక సూరులన్
గనుగొన భ్రాంతులౌదురొ ప్రకాశము నీరము మృత్తు, మూటిలో
వినిమయమొప్ప యుండులెటు లట్లగు జీవజదేవసాత్మకం
బును గుణసర్గమే విభుని బొందికఁగాంచును మృషగాక సత్యమో
తనమహిమంబుచేత సతతంబును మాయఁదొలంచునెవ్వఁడా
తని గుణపూర్ణుఁ శ్రీహరిని ధ్యానముచేసెదనిత్యనిర్మలున్ ॥ ౧

శ్లో॥ ఆపన్న సంసృతిం ఘోరాం యన్నామ వివశోగృణన్
తతస్సద్యో విముచ్యేత యంబిభేతి స్వయంభయః॥ ౧-౧-౧౪

వ్యా॥ భయః = సంసారము, స్వయం = స్వయముగా, యం = ఎవనినామమునుగూర్చి, బిభేతి = భయపడిపారిపోవునో, అట్టి, యన్నామ = ఏశ్రీహరినామమును, గృణన్ = ఉచ్చరించి, వివశః = పరవశుడగువాడు, ఘోరాం = భయంకరమైన, సంసృతిం = సంసారమును, ఆపన్నః = పొందినవాడైనను, సద్యః = తత్క్షణమే, తతః = ఆసంసారము—నుండి, విముచ్యతే = విముక్తుడగును.

గీ॥ ఘోరసంసారవార్ధిలోఁ గూలియుండి
భవభయాపహమైన శ్రీహరునినామ
ముచ్చరించుచుఁ బరవశమొందునరున
కపుడెసంసారబంధంబులడగిపోవు॥

శ్లో॥ సవాగ్విసర్గో జనతాఘవిప్లవో
యస్మిన్ప్రతిశ్లోకమబద్ధవత్యపి
నామాన్యనంతస్య యశోంకితాని యత్
శృణ్వంతి గాయంతి గృణంతి సాధవః॥ ౧-౫-౧౪

వ్యా॥ ప్రతిశ్లోకం = ప్రతిపద్యమును, అబద్ధవత్యపి = అపశబ్దములతో కూడి యుండినను, యస్మిన్ = ఏగ్రంథమందు, అనంతస్య = దేశకాలాదివ్యవస్థాశూన్యుడైన శ్రీహరియొక్క, యశోంకితాని = గజరక్షణాదికీర్తులతో లాంఛితమయిన, నామాని = నారాయణాది నామములు గలవో (యేగ్రంథమున) సాధవః = పరమభాగవతులైన శ్రీశుకాదులు, శృణ్వంతి = వినెదరో, గాయంతి = గానముచేతురో, గృణంతి = ఉచ్చరింతురో, సః = అట్టి, జనతాఘవిప్లవః = జనులయొక్క పాపములను బోఁగొట్టునది వాగ్విసర్గః = ఉత్తమగ్రంథము. అనగా వాసుదేవమాహాత్మ్యము ప్రతిపాదించుగ్రంథమే సద్గ్రంథమనిపించుకొనును

ఉ॥ సాధులు బాడుచున్ వినుచు సంతతమున్ జపియించి మించు నా
మాధవ సద్యశోకలిత మంగళవార్తల బద్ధపద్యసం
బాధితమైన నద్దియె సమంజసకావ్యము పాపపుంజపా
థోధిఁ దరింపఁజేయఁగల తోరపునావ యదే జనాళికిన్॥ 3

శ్లో॥ ఏతన్నిర్విద్యమానానామిచ్ఛతామకుతోభయం
యోగినాం నృప నిర్ణీతం హరేర్నామానుకీర్తనం ౨-౧-౧౧

వ్యా॥ నృప = ఓ పరీక్షిన్నరేంద్రా, ఏతత్ = ఈహరినామకీర్తనము [నీకుమాత్రమే కాదు], నిర్విద్యమానానాం = వైరాగ్యభాగ్యవంతులైనట్టియు, అకుతోభయం = మోక్షమును, ఇచ్ఛతాం = కోరుచుండెడు, యోగినాం = యోగులకును, నిర్ణీతం = నిర్ణయింపబడినదనుమా.

క॥ వైరాగ్యభాగ్యవంతుల
నారూఢంబున నకుతోభయంబగు ముక్తిన్

గోరెడియోగులకును నృప
నారాయణనామకీర్తనము విధిసుమ్మా॥ ౪

శ్లో॥ తదశ్మసారం హృదయం బతేదం
యద్గృహ్యమాణై ర్హరినామధేయైః
నవిక్రియేతాథ ముఖేవికారో
నేత్రేజలంగాత్రరుహేషుహర్షః॥ ౨-3-౨౪

వ్యా॥ యత్ = ఏపురుషునియొక్క, హృదయము,గృహ్యమాణైః = కథారూపకముగాగ్రహించబడు,హరినామధేయైః = శ్రీహరినామములచేత, ముఖేవికారః = మోమునఆనందాదివికారమున్ను నేత్రేజలం = ఆనందబాష్పములున్ను, గాత్రరుహేషుహర్షః = రోమములయందు గగుర్పాటున్ను,(కలుగునట్టుగా)నవిక్రియేత = భావవికారమునుబొందదో,తత్ హృదయం = ఆమనస్సు,అశ్మసారంబత = ఇనుపకట్టె పంటిదికదా

మ॥ హరినామస్మరణంబుజేసెడితఱిన్ హర్షాశ్రుపూర్ల్ గన్నులన్
దొరగన్ మేనఖిలంబుగ్రుల్లుపుఁగన్ రోమాంచసంఫుల్లమై
దరహాసాంకుర చంద్రికల్ మొగమునందల్లార చిత్తంబు దా
గరుగన్నేరని వాని మేనుశవమౌగాఁబ్రాయియౌకట్టియౌ॥ x

శ్లో॥ యన్నామధేయశ్రవణానుకీర్తనా
ద్యత్ప్రహ్వణా ద్యత్స్మరణా దపిక్వచిత్
శ్వాదోపి సద్యస్సవనాయ కల్పతే
కుతః పునస్తే భగవన్ను దర్శనాత్॥ 3-3౪-౬

వ్యా॥ భగవన్ = ఓయిశ్రీహరీ,యన్నామధేయశ్రవణానుకీర్తనాత్ = ఏనీయొక్క నామములను వినుటవలనగాని సంకీర్తనచేయుటవలనగాని, యత్ ప్రహ్వణాత్ = ఏనిన్నుఆశ్రయించుటవలనకాని,క్వచిత్ = ఒకానొకప్పుడైనను,యత్స్మరణాత్

ఏనిన్ను స్మరించుటవలనకాని,శ్వాదోపి = కుక్కమాంసమునుతినువాడైనను,సద్యః = వెంటనే,సవనాయ = యజ్ఞముచేయుటకు,కలపతే = సమర్థుడగునో,అట్టి,తే = నీయొక్క,దర్శనాత్ = సందర్శనమువలన,కుతఃపునః = పవిత్రుడగుననివేరేచెప్పవలెనా

శా॥ నీనామావళిఁబాడినన్ వినిన గానీ నిన్ను సేవి చినం
గానీ లోకైకసారినిన్ స్మరణమైనం జేసినన్ శ్వాదుఁడే
నీవాఁడిల నధ్వరంబు సలుపంగా నర్హుఁడౌఁగాదె య
ట్లే నిన్నున్ గను గొన్న వానిసుకృతంబెన్నంగ శక్యంబొకో॥ ౬

శ్లో॥ అహో బత శ్వపచోతో గరీయా
న్యజ్జిహ్వాగ్రే వర్తతే నామ తుభ్యమ్
తేపుస్తపస్తే జుహువుస్సస్నురార్యా
బ్రహ్మానూచుర్నామ గృణంతి యే తే॥ 3-33-7

వ్యా॥ యజ్జిహ్వాగ్రే = ఎవనియొక్కనాలుకకైన,తుభ్యం = నీయొక్క,నామ = నామము,వర్తతే = ఉండునో,అట్టిశ్వపచః = కుక్కమాంసమును తినువాడైనను,అతః = (విష్ణుసర్వోత్తమత్వజ్ఞానములేని) సోమయాజికంటె,గరీయాన్ = శ్రేష్ఠుడు అహోబత = విష్ణుభక్తిమహిమయెంతగొప్పది. తే = నీయొక్క,నామ = నామమును,యేగృణంతి = ఎవరుచ్చరింతురో,వారు.తపః = తపస్సును, తేపుః = చేసినవారే,సస్నుః = ఆర్యాన్,దేవతలుమొదలగువారినిగూర్చి,జుహువుః = యాగము చేసినవారే, వారిని,బ్రహ్మాన్ = బ్రహ్మజ్ఞానముకలవారినిగా,ఊచుః = చెప్పుదురు.

మ॥ తపముల్ జేసినవాఁడె బాలఁగ సుధాంధస్తృప్తికై యజ్ఞయా
జిపుఁడుండాతఁడె బ్రహ్మవేత్తయతఁడే నీనామముంజిహ్వపై
నెపుడుందాల్చెను వాఁడు వాఁడొకశుభహీనుండుగానీమతిన్
శ్వపచుండైనను యజ్వకంటెఘనుఁడా వందారుమందారకా॥ ౭

శ్లో॥ అశ్నాత్యనంతఃఖలు తత్వకోవిదైః
శ్రద్ధాహుతంయన్ముఖఇజ్యనామభిః
నవైతదాచేతనయాబహిష్కృతే
హుతాశనే పారమహంస్యవర్యగుః॥

వ్యా॥ తత్వకోవిదైః = భగవత్తత్వమును దెలిసిన పురుషులచేత,ఇజ్య = స్తోత్రముచేయుటకు,నామభిః = శ్రీహరినామములచేత,యత్ = యేహవ్యమును,ముఖే = ముఖమునందు,శ్రద్ధా హుతం = శ్రద్ధతో హోమము చేయబడునో, [అట్టిహవ్యము ను] పారమహంస్యవర్యగుః = పరమహంసలచే కోరబడతగినవాక్యములుగల,అనంతః = శ్రీహరి, అశ్నాతి = స్వీకరించునో,తథా = అట్లు,చేతనయాబహిష్కృతే = చేతనముకాని(జడమైన), హుతాశనే = అగ్నియందు,నవైఖలు = స్వీకరించడుకదా.

మ॥ స్తుతియజ్ఞంబుల తత్వకోవిదు .. వేల్పుశ్రద్ధ నామంబులా
హుతిగాగన్ముఖవహ్నిం దానిగొనునెంతో ప్రీతిమై శ్రీసతీ
పతి గాకట్లు నచేతనాగ్ని జ్వలియింపంజేయుపెక్కైలక్
హుతముంజేయు ఘృతాదికంబుంగొనగానొల్లండుపీ్రతాత్మండై

శ్లో॥ జేత్రాః పాదే భగవాంస్తవశార్ఙ్గధన్వా
దేవఃక్షిణోత్యవనతార్తిహరోవిపక్షాన్
యన్నామధేయమభిధాయ నిశమ్యచాద్ధా
లోకోంజసాతరతి దుస్తరమంగమృత్యుమ్॥                    ౪-౧౧-౩౦

వ్యా॥ జేత్రాఃపాదే = ఓధృవుడా,తవ = నీయొక్క,విపక్షాన్ = శత్రువులను,శార్ఙ్గధన్వా = ధనుర్ధరుడైనట్టియు,అవనతార్తిహారః = భక్తులయొక్క పీడనుహరించెడు,దేవః = క్రీడాదిగుణవిశిష్టుడైన,భగవాన్ = శ్రీహరి,క్షిణోతి = కొట్టివేయును శ్రీహరియొటునంటివాడనగా;యన్నామధేయం = ఏహరినామమును,అభిధాయ = స్మరించి,

తితీర్త్వా = విడిచియును, లోకః = జనులు, దుస్తరం = దాటశక్యముకాని, మృత్యుం = మృత్యుప్రాయమైన ఆపత్తును, అంజసా = సులభముగా, తరతి = దాటుదురో, (శ్రీహరి ఉ౨అన్వయము). ఇట్లు మునులు ధృవునికి ఉపదేశించిరి.

గీ॥ మృత్యుతుల్యంబులాపద లేవనినామ
ములస్మరించిన వినిన లోకులు తరింతు
రట్టిశార్ఙ్గధన్వియశస్తారిహారుఁడు
ధ్రువుఁడ నీశత్రుప్రుల నేమఁదో (గఁ)జేయు॥

శ్లో॥ నైవంవిధః పురుషకార ఉరుక్రమస్య
పుంసాం తదంఘ్రిరజసా జితషడ్గుణానాం
చిత్రం విదూరవిగతః సకృదాదదీత
యన్నామధేయ మధునా సజహాతిబంధం॥ ౪-౧-౩౪

వ్యా॥ తదంఘ్రిరజసా = భగవత్పాదధూళిసేవించుటచేత, జితషడ్గుణానామ్ = కామాదిషడ్వర్గమును జయించిన, ఉరుక్రమస్య = శ్రీహరియొక్క, పుంసాం = భక్తులకు, ఏవంవిధఃపురుషకారః = ఇటువంటిమహాత్మ్యము, నచిత్రం = చిత్రముకాదు. (ఏలననగా) విదూరవిగతః = శూద్రాదులకంటెనీచులైనచండాలురైనను (దోషముచేతబహిష్కృతులైనవారైనను) యన్నామధేయం = శ్రీహరినామమును, (ఎవఁడు) సకృత్ = ఒకసారియైనను, ఆదదీత = స్మరించునో అట్టివాఁడు, అధునా = అక్షణమే, బంధం = సంసారబంధమును, జహాతి = విడుచును.

చ॥ చరణపరాగసేవ జితషడ్గుణులౌ హరిభక్తులందునీ
చిరుతమహత్వమెన్న నొకచిత్రముకాదతిదోషదూషితు
ల్నరులొకసారి యావిభునినామముఁగోరిస్మరించిరేని సం
సరణదురంతబంధములఁ జయ్యనబాసి సుఖంబు జెందరే॥ ౧౦

శ్లో॥ అథ కథంచిత్ స్ఖలన క్షుత్పతన జృంభణ దురవస్థానాదిషు వివ
శానాం నశ్ శ్రీమచ్చరణారవిందస్మరణాయ జ్వరమరణదశాయా
మపి సకలకశ్మలనిరసనాని తవగుణకృతనామధేయాని వచన
గోచరాణిభవంతు॥ ౫-3-౧౨

వ్యా॥ అథ = అఖిలమాహాత్మ్యసముద్రుఁడవుగానువు,సకలకశ్మలనిరసనాని = సకలస్త
పాపములనుపోఁగొట్టెడి,తవ = నీయొక్క,గుణకృతనామధేయాని = జ్ఞానానందాదిగుణ
ములు,జగనసహననాదికృత్యములును నారాయణాదినామములును,కథంచిత్ = ఎట్లైనో
స్ఖలన = జారుట,క్షుత్ = తుమ్ముట,పతన = పడుట,జృంభణ = ఆవలించుట,ఈ మొ
దలయిన,దురవస్థానాదిషు = దురవస్థలలోఁబడి,వివశానాం = పరవశులమయిన,నః =
మాకు,జ్వరమరణదశాయామపి = జ్వరబాధయందును మరణబాధయందును, శ్రీమచ్చర
ణారవిందస్మరణాయ = సకలైశ్వర్యయుక్తమయిన నీపాదపద్మస్మరణకొఱకు,వచనగో
చరాణి = వాక్కునసంకీర్తనచేయుబడునవిగా,భవంతు = అగుగాక.

సీ॥ తుమ్ముట దగ్గుట తూలుటకూలుటన్
బహుదురవస్థా వివశుల మైన
మాకు ఘోరజ్వరమరణాదిబాధలఁ
బొల్పడి సంకటపడెడివేళ
నిరుపమశ్రీలచే నిండిననీపాద
సరసీజయుగళసంస్మరణగలుగ
నానందనిర్మలజ్ఞానాదిగుణముల
నిభరాజరక్షాదికృత్యములను

గీ॥ మాటిమాటికిఁ దెలిపిమామానసాబ్జ
వికసనవిధానసవరశ్మిప్రకరమైన
మహితనారాయణాదినామములమాదు
వాక్కులనునిల్పి కావుమీ పరమపురుష॥ ౧౧

శ్లో॥ అయంహి కృతనిర్వేశో జన్మకోట్యంహసామపి
యద్వ్యాజహార వివశో నామ స్వస్త్యయనంహరేః॥ ౬-౨-౭

వ్యా॥ జన్మకోటి = కోటిజన్మలలో, అంహసామపి, = పాపములుకలిగినవారికైన, అయంహి = ఇదేకదా, కృతనిర్వేశః = పొందబడునుఖానుభవము, యత్ = ఏదనగా, అజామిళుడు) వివశః = వివశుడై, హరేః = శ్రీహరియొక్క, స్వస్త్యయనమ్ = మంగళప్రదమైన, నామ = నామమును, వ్యాజహార = ఉచ్చరించెనో, అది.

గీ॥ అదియెనూ బొందఁదగిన సుఖానుభవము
కోటిజన్మలఁబాపంబుఁగూడఁబెట్టి
నట్టివారికిని, వివశుఁడై యజామి
ళుఁడు హరిశుభదనామంబు నుడువగలిగె॥ ౧౨

శ్లో॥ స్తేనస్సురాపో మిత్రధ్రుక్ బ్రహ్మహా గురుతల్పగః
స్త్రీరాజపితృగోహంతా యేచపాతకినోపరే
సర్వేషామప్యఘవతా మిదమేవ సునిష్కృతం
నామవ్యాహరణం విష్ణో ర్యతస్తద్విషయామతిః ౬-౨-౯-౧౦

వ్యా॥ స్తేనః = సువర్ణముదొంగిలించినవాడును, సురాపః = సురాపానముచేసినవాడును, మిత్రధ్రుక్ = మిత్రద్రోహముచేసినవాడును, స్త్రీ = స్త్రీని, రాజ = రాజును, పితృ = తండ్రిని గో = గోవును, హంతా = చంపినవాడును, పరే = ఇతరపాపములను చేసిన, పాతకినః = పాపాత్ములు యేచ = యెవరుకలరో అటువంటి, అఘవతాం = పాపాత్ములైన, సర్వేషామపి = అందరికిని, ఇదమేవ = ఇదియే, సునిష్కృతం = ప్రాయశ్చిత్తము (ఏదనగా) విష్ణోః = విష్ణుమూర్తి యొక్క, నామ = నామమును, వ్యాహరణం = ఉచ్చరించుటయే, యతః = అందువలన, మతిః = మనస్సు, తద్విషయా = శ్రీహరియందు లగ్నమయియుండును.

సీ॥ కాంచనచోరుండు కామినీహంతయు
బ్రహ్మఘ్నుడును సురాపానరతుడు
గోహంత పితృహంత గురుతల్పగుడు హిత
ద్రోహి భూపాలకద్రోహిజనుడు
మఱియు నెన్నేనియు మహిఁ గలపాపముల్
జేసిన పాతకాగ్రేసరులకు
నందరకొకటె ప్రాయశ్చిత్తము మఱొండు
లేదు దీనికి మించి లేదులేదు॥

గీ॥ నిత్యకల్యాణగుణగణ నిలయుఁడైన
హరిపరాత్పరునామసంస్మరణ మొకటె
యవలవారలమనము లాహరిపదాబ్జ
యుగళలగ్నంబులైబా యకుండునెపుడు॥ ౧౩

శ్లో॥ ననిష్కృతైరుదితైర్బ్రహ్మవాదిభి
స్తథావిశుధ్యత్యఘవాన్ వ్రతాదిభిః
యథాహరేర్నామపదైరుదాహృతై
స్తదుత్తమశ్లోకగుణోపలంభకం॥ ౬-౨-౧౧

వ్యా॥ తదుత్తమశ్లోకగుణోపలంభకం = శ్రీహరియొక్క అనంతాదిగుణములను యథాయోగ్యముగా జీవులకు కలుగజేయునట్టియు, బ్రహ్మవాదిభిః = వేదవాదులచేత, ఉదాహృతైః = ఉదాహరింపబడిన, పదైః = పదములతో గూడినదియు, హరేర్నామ = శ్రీహరియొక్క నామము, యథా = ఏవిధముగా పవిత్రముచేయునో, తథా = అట్లు, ఉదితైః = శాస్త్రోక్తమైన, నిష్కృతైః = ప్రాయశ్చిత్తములచేత, వ్రతాదిభిః = వ్రతములు మొదలైనవానిచేతను, అఘవాన్ = పాపాత్ముడు, నవిశుధ్యతి = పవిత్రుడుకాజాలడు

చ॥ తగునటులెల్లజీవులకుఁదద్గుణజాలముబోధమౌనటుల్
నిగమవిదైకబద్ధపదనిష్ఠితముల్ హరినామముల్ భువిన్
దగనఘశోషణంబునుబొనర్చువిధంబునశాస్త్రచోదితం
బగు వ్రతనిష్కృతి ప్రతతులన్నియుఁగూడినజేయనోపునే॥ ౧౪

శ్లో॥ సాంకేత్యంపారిహాస్యంవాస్తోభంహేళనమేవవా
వైకుంఠనామగ్రహణం విశేషాఘహరం విదుః॥ ౬-౨-౧౪

వ్యా॥ సాంకేత్యం = కుమార్లుమొదలైనవారిపేరుపెట్టుకొనిగాని, పారిహాస్యం = మీరునారాయణమూర్తిఅని పరిహాసముచేయుచుగాని, స్తోభం = నీవుశ్రీమహావిష్ణువు కాబోలును, అని, కోపముపుట్టు మాటలచేగాని, హేళనమేవహి = మధువులుఅనగా తేనెటీగలు వానినిచంపుటచేత మధుసూదనుడవని హేళనముచేయుచుగాని, వైకుంఠ నామగ్రహణం = శ్రీహరియొక్కనామమును ఉచ్చరించుట, అశేష = సమస్తమైన, అఘ = పాపములను, హరం = పోగొట్టునని, విదుః = సజ్జనులుతెలిసికొందురు.

సీ॥ రామ కృష్ణాయని ప్రేమమై సుతులకుఁ
బేరిడివారల బిలుచుకొనిన
కేవలమును మీరు కేశవనామ్ములే
యని బావమరదుల హాస్యమాడఁ
దామోదరుఁడ వీవు దర్పంబులేలని
దీపించు కోపాన దిట్టినేని
మొలగజ్జెఁ బద్మనాభుఁడనంగ సార్థకం
బెనయించె ననుచు హేళనమొనర్చ॥

గీ॥ నరయ సాంకేత్యమో పారిహాస్య మొక్కొ-
కినుకనో లేక హేళనము కొరకొ
పాపి వైకుంఠనామముల్పలుకునపుడె
కోటిభవముల పాపముల్గాలిపోవు॥ ౧౫

శ్లో॥ అజ్ఞానాదథవాజ్ఞానాదుత్తమశ్లోకనామయత్
సంకీర్తితమఘం పుంసో దహత్యేధో యథానలః॥ ౬-౨-౧౦

వ్యా॥ అజ్ఞానాత్ = విశేషజ్ఞానములేకగాని, అథవాజ్ఞానాత్ = జ్ఞానపూర్వకముగాగాని, ఉత్తమశ్లోకనామ = శ్రీహరినామమును, యత్ సంకీర్తితం = ఏసంకీర్తనము చేయుటకలదో, అట్టిసంకీర్తనము. పుంసః = పురుషునియొక్క, అఘం = పాపమును, అనలః = అగ్ని, ఏధఃయథా = కర్రలనుదహించునట్లు, దహతి = దహించును.

గీ॥ తెలిసి చేయనొండె తెలియకఁజేసిన
కృష్ణు దివ్యనామకీర్తనంబు
నరుల దురితరాశి చురచుర దహియించు
గట్రియలను వహ్నిగాల్చునట్లు॥ ౧౬

శ్లో॥ క్వచాహం కితవః పాపో బ్రహ్మఘ్నో నిరపత్రపః
క్వచ నారాయణేత్యేతద్భగవన్నామ మంగళమ్॥ ౬-౨-32

వ్యా॥ కితవః = మోసగాడును, పాపః = పాపాత్ముడును, బ్రహ్మఘ్నః = బ్రహ్మణ్యము వదలివేసినవాడును, నిరపత్రపః = సిగ్గులేని వాడును, అయిన, అహం = నేను, క్వచ = ఎక్కడ, నారాయణేత్యేతత్ = నారాయణ అనుయీ, మంగళం, = మంగళప్రదమయిన, భగవన్నామ = భగవంతునినామము, క్వచ = ఎక్కడ.

క॥ దురితాత్ముఁడ వంచకుఁడను
నిరపత్రిఫుఁడం గలధరణీసురవిభులన్
నిరసించిన నేనెక్కడ
హరి మంగళదివ్యనామ మబ్బుట లేదన్॥ ౧౭

శ్లో॥ ఏవం సవిప్లావితసర్వధర్మా
దాస్యాః పతిః పతితో గర్హ్యకర్మా
నిపాత్యమానో నిరయే హతవ్రత
స్సద్యో ముక్తో భగవన్నామ గృహ్ణన్॥ ౬-౨-౪౫

వ్యా॥ ఏవం = ఇట్లు, విప్లావిత = నష్టమయిన, సర్వధర్మః = సకలధర్మములు కలిగిన టువంటియు, హతవ్రతః = కొట్టబడినవ్రతములుకలిగినటువంటియు, పతితః = పతితుఁడయినటువంటియు, గర్హ్యకర్మా = నిందితకర్మకలిగినటువంటియు, దాస్యాఃపతిః = దాసీభర్తయయిన, సః = అజామిళుడు, నిరయే = నరకమందు, నిపాత్యమానః = పడుచున్నవాడైనను, భగవన్నామ = శ్రీహరినామమును, గృహ్ణన్ = ఉచ్చరించినవాడై సద్యః = తత్క్షణమందే, ముక్తః = ముక్తుడయ్యెను.

చ॥ పతితుఁడు నింద్యకర్ముఁడును భ్రష్టసమస్తసుధర్ముఁడున్ హత
వ్రతుఁడును నీచభామినికిభర్తయునైనయజామిళుండధః
పతితుఁడునౌచు శ్రీవరుని పావననామముసంస్మరించి శ్రీ
పతిసదనంబుఁజేరె భవబంధవిముక్తుఁడునై క్షణంబులో॥ ౧౮

శ్లో॥ నాతఃపరం కర్మనిబంధకృన్తనం
ముముక్షతాం తీర్థపదానుకీర్తనాత్
నయత్పునః కర్మసు సజ్జతే మనో
రజస్తమోభ్యాం కలిలం తతోన్యథా॥ ౬-౨-౪౬

వ్యా॥ ముముక్షూణాం = మోక్షమందుయిచ్ఛగలవారికి, కర్మనిబంధకృంతనం = కర్మబంధమునుపోగొట్టునది, తీర్థపదానుకీర్తనాత్ = శ్రీహరిసంకీర్తనముచేయుటకంటె, అతఃపరం = మరియొకటి, న = లేదు పునః = ఇంకకాదు, రజస్తమోభ్యాం = రజస్తమోగుణములచేతను, కలిలం = కలుషమయిన, యత్ = యేమనస్సుకలదో (అట్టిమనస్సు) కర్మలయందు, నసజ్జతే = లగ్నముకాదు; అన్యథా = శ్రీహరి సంకీర్తనము చేయుటవినాగా నచ = ఇట్టిఫలితముకటస్థపడదు.

మ॥ చిరకాలార్జితకర్మపాశతతికాచ్ఛేదంబుఁజేయన్ మనం
బురజస్తామసవాసనోల్బణితసంమోహాంధతామిస్రని
ర్ఝరవేగోద్ధతిఁగర్మసన్మతికిఁబో సస్సజ్యంబు గాదామికిన్
హరిసంకీర్తనమేముముక్షువులకస్యంబుల్ప్రయాసాంతముల్ గన్

శ్లో॥ నవై సనరకం గచ్ఛేన్నేక్షితో యమకింకరైః
యద్యప్యమంగళో మర్త్యో విష్ణులోకేమహీయతే॥
మ్రియమాణో హరేర్నామ గృణన్ పుత్రోపచారితమ్
అజామిలోప్యగాద్ధామ కిముతశ్రద్ధయాగృణన్॥ ౬-౨-౪౮-౪౯

వ్యా॥ సఅజామిళః = ఆ అజామిళుడు, యమకింకరైః = యమకింకరులచేత, ఈక్షితః = చూడఁబడినవాడైనను, నరకం = నరకమునకు నగచ్ఛేత్ = పోలేదు, అమంగళమర్త్యో యద్యపి = అయోగ్యపురుషుడైనను, విష్ణులోకే = విష్ణులోకమునందు, మహీయతే = గొప్పస్థానమందున్నాడు; మ్రియమాణః = చచ్చుచు, పుత్రోపచారితః = కుమారుని పిల్చుచు, హరేర్నామ = శ్రీహరినామమును, గృణన్ = ఉచ్చరించినవాడై, ధామ = వైకుంఠమును, అగాత్ = వెళ్లెను; శ్రద్ధయా = శ్రద్ధతో, గృణన్ = ఉచ్చరించినవాడు, కిముత = ఏమిచెప్పవలెను.

చ॥ సతతధికపాపవర్తనుఁడ జామిళుఁడర్కతనూజు కింకరుల్
తమపురికీడ్వఁగాఁ జనక దారసుతాదులతెన్ను బోని ని
ర్మములకుఁగూడ దూరమగు మాధవలోకనివాసుఁడయ్యెఁదా
నిమిసములోన శ్రీశపదనీరజపీఠసమీపవర్తియై॥ ౨౦

గీ॥ చావఁగానుండి సుతుఁగడసారిచూచు
నిచ్చఁబిల్చుచు హరినామముచ్చరించు
నంతమాత్రిన, శ్రీధనత్యంతభక్తి
భజనజేసిన ఫలము జెప్పంగవశమె॥ ౨౧

శ్లో॥ ఏతావతాలమఘనిర్హరణాయ పుంసాం
సంకీర్తనం భగవతో గుణకర్మనామ్నాం
విక్రుశ్య పుత్రమఘవాన్యదజామిళోపి
నారాయణేతి మ్రియమాణ ఇయాయ ముక్తిమ్॥ ౬-3-౨౪

వ్యా॥ పుంసాం = పురుషులకు,అఘనిర్హరణాయ = పాపముపరిహారమగుటకు, భగవతః = శ్రీహరియొక్క,గుణ = గుణములయొక్కయు,కర్మ = కర్మలయొక్కయు, నామ్నాం = నామములయొక్కయు,సంకీర్తనం = ఏసంకీర్తనముకలదో,ఏతావతా = అట్టిసంకీర్తనముచేతనే,అలం = చాలును,(వేరేసాధనాంతరమక్కరలేదనుట, ఏమనగా,)అఘవాన్ - పాపాత్ముడయిన,అజామిళోపి,అజామిళుడున్ను,మ్రియమాణః = చనిపోవుచున్నవాడై,పుత్రం = తనకుమారుని నారాయణేతి = నారాయణఅని, విక్రుశ్య = పిలిచి,ముక్తిం = మోక్షమును,ఇయాయ = పొందెను.

మ॥ హరినామగుణనామకీర్తనమె మర్త్యశ్రేణికింజాలు మే
దురపాపాటవిఁ గాల్ప, ఘోరదురితాత్ముండౌ నజామీళుఁడ

బ్బరవుశ్మశ్రుముఁ జూరఁగాఁ గొనఁ డా శ్వపుత్రుంగను బేర్మిమజె
స్మరణాతిరేకంగనగొ రె పేరఁ బిలువన్నారాయణాయంచుఁ గుర్ణ॥ ౨౨

శ్లో॥ నహి భగవన్నఘటితమిదం త్వద్దర్శనాన్నృణామఖిలపాపక్షయః
యన్నామ సకృచ్ఛ్రవణాత్పుల్కసోపి విముచ్యతే సంసారాత్॥

వ్యా॥ త్వద్దర్శనాత్ = మీ సందర్శనము వలన, నృణాం = నరులకు, అఖిలపాపక్షయః = సమస్తపాపములును నశించును నెడు, ఇదం = ఈ అంశము, అఘటితం నహి = అశక్యము కాదు, (ఏమనగా, భగవన్ = ఓ స్వామీ, యన్నామ = యే మీ నామమును, సకృత్, = ఒకానొకప్పుడు నున్ను, శ్రవణాత్ = వినుటవలన, పుల్కసోపి = చండాలుడయిన నుసంసారాత్ = సంసారమునుండి, ముచ్యతే = విడువబడుచున్నాడో. ౬-౨-౧౦

చ॥ పడినొకనాఁడు సీపతి పావననామము శ్రోత్రవీథిఁ దా
బడినను బుల్కసుండయిన బాయును సంసరణోగ్రబంధముల్
తడయక నింకనో వరద తావకమంగళదివ్యరూపమీ
జడమగు కన్నులం గనగ జాలుటలబ్రిమె పాపశాంతికిన్॥ ౨౩

శ్లో॥ యథా గ్రహాగ్రస్త ఇవక్వచిద్ధస
త్యాక్రందతే ధ్యాయతి వందతే జనః
ముహుశ్శ్వసన్వక్తి హరే జగత్పతే
నారాయణేత్యాత్మగతిర్గతత్రపః॥ ౭-౭-౩౪
తథా పుమాన్ముక్తసమస్తబంధన
స్తద్భావభావానుకృతాశయాకృతిః
నిర్దగ్ధబీజానుశయో మహీయసా
భక్తిప్రయోగేణ సమేత్యధోక్షజమ్॥ ౭-౭-౩౫

వ్యా॥ ఆత్మగతిః = ఆత్మజ్ఞానముకల, జనః = జనుడు, గతత్రపః = లజ్జవిడిచి, హారే, జగత్పతే, నారాయణ, ఇతి = అని, ముహుర్ముహుః = మాటిమాటికి, వక్తి = పలుకునో, గ్రహగ్రస్తఇవ = పిశాచముపట్టినవానివలెనే, క్వచిత్ = ఒక్కొక్కప్పుడు, హసతి = నవ్వునో, ఆక్రందతి = రోదనముచేయునో, వందతి = నమస్కరించునో, ధ్యాయతి = ధ్యానము చేయునో, తదా = అప్పుడు, పురుషః = ఆపురుషుడు, ముక్తసమస్తబంధనః = సకలబంధములుతెగగొట్టుకొనినవాడై తద్భావ = తనస్వరూపానుసారమైన, భావ = భక్తిచేత, అనుకృత = అనుకూలముగా ప్రకటింపబడిన, ఆశయాకృతిః = అంతఃకరణముయొక్కఆకారముకలవాడై, నిర్దగ్ధ = నాశమయిన, బీజ = కర్మబీజము, అనుశయః = సంసారమునుగలవాడై మహీయసా = గొప్పదయిన, భక్తిప్రయోగేణ = భక్తియోగముచేత, అధోక్షజం = శ్రీహరిని, సమేతి = పొందును.

సీ॥ మదిబిడియముమాని మాటిమాటికి హరీ
నారాయణా జగన్నాథ యనుచుఁ
గనుభక్తిఁబాడుచుఁ గ్రహనిబద్ధుఁడువోలె
నవ్వుచు నేడ్చుచు నతులనిడుచు
ధ్యాననిమగ్నుఁడై యందందనిలచుచు
నిట్లాత్మవేత్త తానెప్పుడుండు
నప్పుడే బంధంబులన్నియు విడఁబడఁ
దనస్వభావమునకుఁదగినయట్లు

గీ॥ భజనకీర్తనగానాది బహువిధముల
భక్తి వెల్లువమై పాఱఁబ్రాక్తనంపు
కర్మబీజమ్ముతో భవకాననమ్ముఁ
గాల్చి కడఁతేరి తానధోక్షజునిఁజేరు॥ ౨౮

శ్లో॥ యజ్ఞేశ యజ్ఞపురుషాచ్యుతతీర్థపాద
తీర్థశ్రవశ్శ్రవణమంగళనామధేయ
ఆపన్నలోక వృజినోపశమోదయాద్య
శంనఃకృధీశభగవన్నవసన్ననాథ॥ ౮-౧౬-౮

వ్యా॥ యజ్ఞమునకు నియామకుడా, ఎవరినుద్దేశించి యజ్ఞమును చేయవలయునో అటువంటి ముఖ్యపురుషుడా, నాశరహితుడా, సమస్త పుణ్యతీర్థములును తన పాదమందు గలవాడా, శాస్త్రములను వినుటకు సాధనమయిన శ్రోత్రములకు మంగళప్రదమైన నామధేయములుకలవాడా, ఆపదలను పొందిన జనులయొక్క పాపములను పరిహారము చేయుటకొరకు అవతారము నెత్తువాడా, దీనజనరక్షకా, ఇప్పుడు, మాకు సుఖము నొసగుమా.

ఉ॥ సన్నుతిఁజేతు మాకు సుఖసంపదలియ్యవె దీనరక్షకా
జన్నపుసామి యజ్ఞపురుషా ధృతతీర్థపదాబ్జయుగ్మ యా
పన్నజనాఘసంచయముఁ బాపఁగఁబుట్టిన మానవాకృతీ
వెన్నుఁడ యచ్యుతా భువనవిశ్రుతమంగళనామ శ్రీహరీ॥ ౨౪

శృణ్వన్ గృణన్ సంస్మరయంశ్చ చింతయ
న్నామాని రూపాణి చ మంగళాని తే
మం॥ క్రియాసు యస్త్వచ్చరణారవిందయో
శ్లో॥ రావిష్టచిత్తో న భవాయ కల్పతే॥ ౧౦-౩-౮

వ్యా॥ శ్రీహరికి నామరూపాదులు కలవు కనుక, వారివారివలన జరిగించబడు క్రియలకు శ్రీహరి ప్రేరకుడని పూజ్యుడని అనుసంధానముతో హరియొక్క నామములను జ్ఞానపూర్వకముగా స్మరించుచు, వినుచు, కీర్తనము చేయుచు, ఆయన అప్రాకృత దివ్య మంగళ రూపములను ధ్యానము చేయుచు, యే పురుషుడుండునో అట్టి పురుషుడు, శ్రీహరియొక్క పాదారవిందమందుంచబడిన చిత్తముకలవాడై, సంసార[illegible]గా సంబంధ

# శ్రీమద్భాగవతసారము.

శా॥ నీనామావళిఁ బాడుచున్ వినుచుఁ జింతించుచుం దావకా
నూనాపాకృతమంగళాకృతుల నత్యుత్కంఠఁ ద్వత్ప్రేరణా
ధీనంబుల్ క్రియలంచు గర్మముల హృత్ప్రీతిన్ భవత్పాదసం
ధానం బేర్పడఁ జేయువాఁడు మరలన్ సంసారిగాఁ బోవునా॥ ౨౯

శ్లో॥ యన్నామ గృహ్ణన్నఖిలాన్ శ్రోతౄనాత్మానమేవ చ
సద్యః పునాతి కిం భూయః తస్య స్పృష్టః పదా హి తే॥

తా॥ ఏ శ్రీహరి నామమును సంకీర్తనము చేయు పురుషుడు తనను, ఆ సంకీర్తనమును వినువారందరిని, ఆక్షణమందే పవిత్రము చేయునో, అట్టి శ్రీహరియొక్క పాదములను స్పృశించిన మీకు ఎంత పుణ్యవిశేషము కలదని చెప్పగలది.

చ॥ దురితచయమ్ము లెల్లఁ దనతోడ శ్రోతలకున్ క్షణంబులో
పరిహృతిఁ జేయు మాధవుని బాడుచు నెవ్వని దివ్యనామము
న్హరిని స్పృశించు భాగ్యచయ మబ్బెను మీ సుకృతాతిరేకముల్
తరమె గణింప నిల విధాతకునైన ధరాతలంబులో॥

శ్లో॥ శృణ్వన్ సుభద్రాణి రథాంగపాణేర్జన్మాని కర్మాణి చ యాని లోకే
గీతాని నామాని తదర్థకాని గాయన్ విలజ్జో విచరేదసంగః॥

తా॥ శ్రీహరియొక్క మంగళప్రదమయిన అవతారములు, క్రియలు, కీర్తనములు, వాని అర్థములను, ఏవి లోకప్రసిద్ధములో వానిని వినుచు, నిర్లజ్జుడై గానము చేయుచు దేనియందును ఆసక్తి లేక విరక్తుడై సంచరింపవలెను. ౧౦-౩-౩

మ॥ భువిలో నెయ్యవి సుప్రసిద్ధములు గోవిందాఖ్యభద్రంబులౌ
నవతారంబులు విక్రమంబులు చరిత్రాలాపము ల్గీతము
[illegible] నాలుక [illegible] గాయించుచున్

